ఓమ్. పరదేవతాయైనమః.

# శ్రీ పోలమాంబాస్తోత్రదండకము.

గీ॥ శ్రీమదఖిల భక్తవ్రజ కామదాంబ
సైకత సితంబ, ముఖజిత చంద్రబింబ
సుగుణ నికురుంబ, పోషిత సురకదంబ
పోషిత కరుణావలంబ, శ్రీపోలమాంబ॥

శ్రీమత్సమస్తామరవ్రాత సంస్తుత్య చారిత్ర, శృంగారగాత్రి, సదాస్తోత్రపాత్రి, స్ఫురద్దంబుజాతోపమస్తుత్యనేత్రి, శుభాకారి, బ్రహ్మాండభాండోదరీ, భక్త భద్రంకరీ, సత్కృపాసాగరీ, శ్రీకరీ, ఈశ్వరీ, రాజరాజేశ్వరీ, సర్వభూతేశ్వరీ, దుర్గ, మాహేశ్వరీ, యర్ధనారీశ్వరీ, శైలరాజేంద్రనందిని, శర్వాణి, దాక్షాయణీ, బర్హిబర్హవ్రాత వేణీ; మహాఘోర దారిద్ర్యసంహారిణీ, మంజుసంభాషిణీ, యోగమార్గన్యసంచారిణీ; కీరవాణీ, మృడాణీ, భవానీ, పురాణీ, పృథుశ్రోణి! గీర్వాణి, సారక్షితాబ్జోద్భవాద్యామరశ్రేణి! కోట్యర్కసంకాశినీ, లోకసమ్మోహినీ, దైవచూడామణీ, నిత్యకళ్యాణి, దైతేయసంహారిణీ, భక్తహృత్పద్మసమ్మోదసందాయినీ, పద్మరాగోజ్జ్వలద్దివ్య హారావళీ భూషణీ, తార, డిండీర, మందార, కర్పూర, ముక్తావళీ

హారములో ప్రమసృత్య సత్కీర్తి సంపత్సమూహాన్వితే,
గీపిశాలాన్వితే, రాజితానంత సంపద్యుతే,
నాను చాంపేయ పుష్పోపమస్నిగ్ధనాసాన్వితే, పూర్ణ
కేందు బింబాస్య, బింబాధరీ, కంబుకంఠీ, యనూ
నాను రాగాన్వితే, నీలజీమూత రోమావళీరాజితే; ఫీన
వక్షస్థలే, మత్త వేదండ తుండోరుభాగే సురాధ్యక్షు,
పంచాస్యమధ్యా, శరత్పూర్ణిమాచంద్రికా మందహా
సప్రభాభాసితే. పాణిపద్మద్వయా, యాదిశక్తీ, మహాధీ
ర గాంభీర్యసౌందర్యరూపోజ్జ్వలీ, భక్తసంసక్త సద్భ
క్తసందోహ మోక్షప్రదాయీ, మహామాయి, శ్రీ
కాంకర్ణద్వయీ, యంబ, కాత్యాయనీ, లోకమా
తా బుధస్తుత్యసౌందర్య లతాంగనీ, శ్రీకరీ, తొల్లిభూ
మ్యగ్ని వాయ్వాదియా పంచభూతప్రపంచంబు, దధ్యే
క్షురసాజ్యాదియా సప్తపాథోధి సంఘంబు, సూర్యేందు,
భౌమాబ్జజాదిగ్రహంబుల్, సురానీకముల్, తారకల్,
యక్షరక్షావ్సర శ్రేణియుల్, మర్త్యులుల్ లేక నిశ్శబ్దమై
యుండు కాలంబునందీవు, సంపూర్ణ తేజంబుతో సర్వబ్ర
హ్మాండ భాండంబులన్ నిండిబల్ దండిగానుండి, స్వేచ్ఛా
నుకూలంబుగా, నీదు శక్తిప్రభావంబుచే సర్వముల్
సృష్టిగావింపనూహించి, యబ్జోద్భవబ్జాక్షు, నబ్జారిధా
రుల్ జగంబులను నీయంశచే ముందుగా నుద్భవంబొం

దగాజేసి, యుద్వారికిన్, సర్వమున్, సృష్టిగావింప,
బెంపొందగా, నాశసంబొందగా జేయు సంపూర్ణశక్తుల్
ప్రసాదించి యాధిక్యతన్ నిల్ప, నాదాదిగా వాంలీ వేదము
లోకంబులన్, జంతుజాలంబు సర్వంబునున్ గల్గగా,
వెల్గగా, నిల్గగా, నీదుయాజ్ఞానుసారంబుగా జేయువా
రంచు పౌరాణికుల్ బల్కగా, వీనులన్ విందుగా విం
దు, నందీవు బృందారకేంద్రాద్రి గీర్వాణసందోహ
సంపూజితాంఘ్రిద్వయున్ సచ్చిదానందు పంచాస్యు,
ఖండేందుధారిన్, విరూపాక్షు త్రైలోక సంరక్షదీక్షున్
భుజంగావళీహార భూషోజ్జ్వలున్ సర్వభూతేశ్వరుండై
న మాహేశ్వరున్ గాంచి సాహించి, యాదేవ దేవేశు
నర్ధాంగివై సర్వభోగంబులన్ బొందుచున్ సంతతానం
ద సుస్వాంతవై, వాని చందోదు వాదోదుగా నిల్చి దు
ష్టాసుర వ్రాతముల్ జీల్చి చెండాడుచున్ సర్వగీర్వాణ
సందోహ సంస్తోత్ర చారిత్రవై, వారణాసీ ప్రయా
గాది పుణ్యప్రదేశంబు లంధ్రాంధ్ర, బంగాళ, నేపాళ,
పాంచాల, కాశ్మీర, సౌవీర, సౌరాష్ట్ర, కర్ణాట, లాటా, మ
రాటా, వరాటాది పుణ్యప్రదేశంబులన్, దుర్గ, కామా
క్షి, మీనాక్షి, చండీ, విశాలాక్షి, శ్రీశారదాంబా, బాస్ర
పూర్ణాంబ, జ్ఞానాంబ, మూకాంబ, భూలోకమాతా,
మహాకాళి, బాలా, త్రిభువనేశ్వరీ, శాంకరీ, యోగేశ్వరీ,

ద్రాదిగాఁగల్గుబల్ వన్నెలఁ మిన్నయై వెల్గు నానావిధా
భిఖ్యలఁ దాల్చి సంచారముఁ జేయుచుఁ, నిన్ను నత్యం
త సద్భక్తితో సంతతం బాత్మ సంస్తుత్యముఁ జేయు స
ద్భక్త సంఘంబు నత్యంత కారుణ్య దృష్టిఁ విలోకించి,
యాయుష్య, మారోగ్య, మైశ్వర్యముఁ, పుత్రులుఁ,
మిత్రులుఁ, భృత్యులున్, స్యందనచ్ఛత్రముల్, సుంద
రారామముల్, అశ్వగంధేభముల్ పూజ్యసామ్రాజ్య.
ముల్ కల్గి సంపూర్ణవిఖ్యాతిచే వెల్గఁగా జేసి సత్కీర్తి భూ
మండలంబెల్ల వ్యాపింపగా జేయుచుఁ. భూతలంబం
దు సత్య, క్షమా, శాంతి, కారుణ్య, సంయుక్త సద్భక్త
పర్యాశ్రమంబై, సదా భాగ్యపూర్ణంబై, బుధానీక సారక్షి
తా కల్పభూజంబులై, దానధాధేయులఁ, పూర్ణ
విఖ్యాతిచే వెల్గు శ్రీపూష వాశ్యన్వయోద్భూత శ్రీవిజ
యరామావనీనాథ సాముప్రతిష్ఠితంబైన, శ్రీవిజయన
గగీంద్రి పట్నంబుకున్ దాపుగానుండి శ్రీలక్ష్మికిఁగా
పురంబై, పసందా, వంసతన్న గ్రామమంబునఁ బా
ములఁ బొందు సద్భక్తులన్ నీదు కారుణ్యదృష్టిఁ విలో
కించి కాపాడగా, నాత్మలో నూహగావించి, మేల్మంచి
రంగారు, బంగారు, జల్తార్ బుటేదారు కాశ్మీర పుఁ
పట్టుపుట్టంబు శృంగారమౌ కంచుకంబొందు చెల్వంబు
గాదార్చి, ఇందిందిరవ్రాతముఁ గ్రిందుగా జేయుగా

జాలి బల్పన్నగానున్న పిన్నారియా పెన్నెరుల్ ను
న్నగాదువ్వి, చెన్నారు కొప్పుంద మింపొందగా బెట్టి,
యాకొప్పుపైనొప్పగా, గొప్ప చామంతి, చాంపేయ
మందార, కుందాది పుష్పంబులున్, రాగిడీ చంద్రవం
కల్ మహాతేజపుంజంబులన్ జిమ్ముచుండంగ, బాలేం
దుబింబంబొకో యనుచు సంస్తుత్యమున్ జేయగా జాలు
ఫాలప్రదేశంబునన్ దాండవింపంగ, రత్నాల చేర్చు
క్కయున్ చిన్న కస్తూరి తిలకంబు జెన్నారగా, మీర
గా, కన్నులన్ గాటుకన్ దిద్ది, శ్రీకారతేజంబులన్ గాం
చి చీకొట్టగా జాలు, కర్ణంబులన్ తళ్కుగుల్కంగ నీలం
పు బావిళ్లునున్ కర్ణపుష్పంబులున్ అందమింపొందగా
నుంచి, చాంపేయపుష్పంబునున్ గేరుతీరైన నాసన్ మ
హారత్నసంతానమున్నింపు నత్తింపుసొంపారగా, నాణె
ముత్యంబుతో చంద్రకాంతోజ్జ్వలంబౌ బులాకీ కళ
ల్ మోమునన్ జేరుచున్ వెన్నెలన్ గాయ, కంఠప్రదే
శంబునన్ జిల్కుతాళీ, స్ఫురద్రత్నహారంబులున్ చం
ద్రహారంబులున్ మోహరీ పేరులున్నుంచి, యాబాహు
లన్ బాజబందుల్ మరిన్ దండకడ్యాలు వంకీలు, హ
స్తంబులన్ పొంకమౌ కంకణాల్ ముద్దులున్ తళ్కు
గాజుల్ ప్రకాశింపుచున్ ఘుల్లుఘుల్లంచు మ్రోయం
గ, వేళ్లందునన్ యుంగరాల్ దాల్చి పాదంబులన్

రత్నమంజీరముల్ పావడాల్ నిత్యాకముల్ గొల్సు
లుఁ జిత్రమైనట్టి పాంజేబులుఁ బెట్టి, అబ్రంబుగా,
కన్నులఁ జూడఁగా, నున్నదో, లేదో, యంచెన్నగా
జాలి, యామిన్నునఁ జాలి, బల్ సన్ననై, మిన్నయై
యున్న నాకౌను సన్ ఘంటలో ఢాణముఁ బెట్టి,
శ్రీగంధ, కాశ్మీర, కస్తూరి, జవ్వాజి సౌగంధద్రవ్యం
బులను మేన నిండారఁగాఁ బూసి యాహాసనల్ దిక్కుల
న్ గుబిమ్మిరింపంగ, దేదీప్యమానప్రభా భాసితంబైన
దేహంబుతో మత్తవేదండయానంబుతో, మందహా
సంబుతో, కోకిలారావముల్ గుల్క శ్రీపోలమాంబా
ఖ్యనే తెంచి సంచారమేఁ సల్పునిఁ గాంచి, హర్షించి,
సద్బ్రాహ్మణుల్, భూపవర్యాగ్రణుల్, వైశ్యులుఁ, శూ
ద్రసంఘంబు మోదంబుతో నిన్ను బూజింపుచుఁ రోగ
నిర్ముక్తులై, భక్తి సంతోషసంయుక్తులై, భోగభాగ్యంబు
లఁ గాంచు, నీనిర్మలంబైన సత్కీర్తి భూమండలం బెల్ల
వ్యాపింపగా జేయుచుఁ భక్తితో, పసపు కుంకంబులు
ఁ, పత్రిపుష్పంబులుఁ, పండ్లు ఫలహారముల్, యిక్షు
ఖండంబులుఁ, కజ్జముల్, అర్శలప్పాలు నొబ్బట్లు మేల్
చలిమిడి పొడపప్పులుఁ పాయసాన్నంబులుఁ, కూటికుం
భంబులుఁ గండదీపంబులుఁ, మేషమహిషంబులున్,
కుక్కుటవాతిలముఁ, నావదిపాదినైవేద్యముల్, కా

చ్చి యర్పించి, తా మెల్లసద్బంధుమిత్రాళితో, నైక్యభా
వంబుతో, వేడుకఁ గూడి వేంచేసి బాజా భజంత్రీలు,
సన్నాయిభణ్యండూస్వరాసిక వాయిద్యముల్ వీనులఁ
విందుగావింపనాడప్పవాయిద్యముల్ థిణ్ థణాలంచు
దిక్పాళి భేదింపమ్రోగింపగా, శంఖముల్ పెద్దభేరీలు
భోంకారముల్ గ్రల్పుచుఁ సర్వబ్రహ్మాండ భాండంబుల
న్నిండిఘూర్ణిల్లగా; వెన్నగాలంబులున్ నోటితాళం
బులుఁ వేయ బెత్తంబులుఁ దాల్చిబల్ చిత్రవై చిత్ర్యసు
స్యందనవ్రాతముఁ జేర్చి యర్పించి వింతైన వేషాలతో
నీకుతిర్థిధి మాహోత్సవంబొప్పుముల్ గొప్పగా, మెప్పు
గా, జేయగా దూరదేశంబులందుండి వీక్షింప నేతెం
చు స్త్రీబాలవృద్ధుల్ గణింపంగ కోటానకోట్లుందు; రా
యుత్సవంబందు వీక్షింప నింకొక్క చిత్రంబు, చర్చింపఁబ
ల్కఁ దురూహ్యంబట్టిదానిఁ బ్రశంసింప నెంతేని మో
దంబు చేకూరు, నేమన్న నో దేవి యీ యుత్సవంబందు వే
రొక్క శకటంబు పైనుండు సురుమ్రాను నానొప్పు పెఁ
దారువుఁ గాంచనామింటికిఁ, మంటికిన్ మర్త్యులఁ
దేవసంఘంబు సంచారముఁ జేయ నూహించి, యేర్పా
టుగా నిడ్డమార్గంబిదౌనేమొ, యంచెన్నగా, దిన్నగా,
మిన్నయై, మిన్నునఁ ముట్టునద్దాని, యగ్రంబునఁ వ
న్నియల్ గుల్కుచుఁ శిల్పినిర్మాణ చాతుర్య సంపత్స

మూహాన్వితంబై, యుడాఁ బాలుగా, డంబుగా, దారు
నిర్మాణితాశ్వంబు వెల్గొంచు,నాదారుకాశ్వంబు పైని
కల్కి భక్తుండు పావాన్యనిష్ఠాగరిష్ఠుండుస్థానంబుగావిం
చి మేల్ చల్వదువ్వల్వలఁ దాల్చి, రంగారు, బంగారు,
శృంగారమౌ భూషణాలంగముందెల్లెడఁ బెట్టి, ఫాలప్రదే
శంబునఁ జిన్న కాశ్మీరపుఁ బొట్టు చెన్నారగా దిద్ది, శీర్షం
బుపై మేల్ జరిపాగినుఁ జాకచక్యంబుగాజుట్టి, హస్తం
బునఁ దర్పణంబొందుహస్తంబునఁ ధాగధగ్యంబునౌ
ఖడ్గముఁ బట్టి, నిర్భీత చేతస్కుఁడై, దేవితుభ్యంనమో
స్తంచునీనామస ఙ్కీర్త్యముఁ జేయుచుఁ అంబరాశ్వం
బునందుండి సంచారమ్ముఁ జేయు,నద్దానినిఁ గాంచు మ
ర్త్యాళిహోవిస్మయోద్భ్రాంతి విభ్రాంత చేతస్కులై కొంద
రాత్మఁ నిదానించి, కళ్లొప్పలఁ వేయకఁ దప్పకఁ జూ
చి, యీయంబరంబందు సంచార్యముఁ సల్పునాతండు
శ్రీపోలమాంబోత్సవంబుఁగనఁ భక్తి విచ్చేయు వేల్పేశు
డో యశ్వరత్నంబు యుచ్చైశ్శ్రవాభిఖ్యమో యంచు వే
ల్పేశు డెన్నఁ సహస్రాక్షుడీతండు అక్షిద్వయుండల్ల యిం
ద్రాశ్వమున్నంగ ధావళ్యమైయుండు నీయశ్వమీ ఖిం
పబల్ రంగులన్నొండె, నీయంశముల్ చూడనాతండు వే
ల్పేశుఁడుఁ గాడు,ఆయశ్వము చ్చైశ్శ్రవాభిఖ్యయుఁ గా
దు.యీతండునిక్కంపు మర్త్యుండె కానోపు మర్త్యుండె

# ప్రకటన.

---

సుప్రసిద్ధపత్రిక!! అతిచౌక!!!

శుభప్రతి!! అతిచౌక!!!

# శ్రీమదాంధ్రమహాభారతము.

ఆదిపంచకము-పద్యకావ్యము.

రాయల్ సైజు 944 పేజీలుగల ఆదిపంచకము

ఇందు ఆదిపర్వ-సభాపర్వ-ఆరణ్యపర్వ-విరాటపర్వ-ఉద్యోగపర్వములు ఇమిడియుండును 8941 పద్యములతో ప్రకాశించుచున్నది. వెల 1-0-0

# కృష్ణలీలా డ్రామా

మిగులరసవంతమైనది.

విక్రయమునకుసిద్ధముగానున్నది, వెల0-8-0

అగ్నిహోత్రపు సూర్యనారాయణ, ప్రొప్రయిటర్,

ఆనంద బాల సరస్వతీ ముద్రాక్షరశాల,

విశాఖపట్టణము.

